శ్రీరామ

# కృష్ణనామము

కృష్ణనామము కృష్ణనామము కీర్తనీయము కృష్ణనామము

1) వైష్ణవత్వము నిచ్చు నీనామం శ్రీకృష్ణనామం

పలికినప్పుడె సర్వపాపము పాడు జేయును కృష్ణనామం
2) తొలగజేయు నెల్లరకు దుర్దశల నీనామం శ్రీకృష్ణనామం

ప్రబల రోగములనెడి పర్వత పంక్తి నరుకగ కృష్ణనామం
3) సబలమగు వజ్రాయుధంబని చాటదగు నీనామం శ్రీకృష్ణనామం

ఆదిమునియగు నారదులు కొనియాడుకొన్నది కృష్ణనామం
4) వేదవిదులగు సుజనులకు సంవేద్య మీనామం శ్రీకృష్ణనామం

దుమ్ముజేయును దలచువారల దుఃఖముల నీ కృష్ణనామం
5) నమ్మికొలిచెడివారలకు రత్నాలనిధి యీనామం శ్రీకృష్ణనామం

అందముగ బృందావనంబున నాలమేపిన కృష్ణనామం
6) నందగోపుని మందిరము నానంద మీనామం శ్రీకృష్ణనామం

7) గొల్లపిల్లలతోడ చలుదులు గుడిచినట్టిది కృష్ణనామం
అల్లరులు గావించె మును వ్రేపల్లె నీనామం శ్రీకృష్ణనామం

8) కాంతనందుని భార్య రోటికి కట్టివైచిన కృష్ణనామం
వింతగా మద్దులను రెంటిని విరిచె నీనామం శ్రీకృష్ణనామం

9) గోపవనితలమై కోకలు కొల్లలాడిన కృష్ణనామం
పాపరాక్షసి ప్రాణమును పోబాపె నీనామం శ్రీకృష్ణనామం

10) దుష్టకురు సభ బన్నమొందిన ద్రుపదపుత్రికి కృష్ణనామం
కష్టములు తొలగించి మానముగాచె నీనామం శ్రీకృష్ణనామం

11) హేలగా గోవర్ధనము పైకెత్తినట్టిది కృష్ణనామం
లీలనింద్రుని దర్పమును దూలించె నీనామం శ్రీకృష్ణనామం

12) పేదబాపని పిడికెడటుకుల ప్రీతిగన్నది కృష్ణనామం
ఖేదమార్చి మహాధనము లొలికించె నీనామం శ్రీకృష్ణనామం

13) మందమతియగు బాణరాక్షసు మదమడంచిన కృష్ణనామం
యిందుధరు గర్వమును హరియించె నీనామం శ్రీకృష్ణనామం

14) పాండురాజకుమారసమితికి నండయైనది కృష్ణనామం
భండనము వలదంచు దౌత్యము నెరపె నీనామం శ్రీకృష్ణనామం

15) గురునిలింపనదీసుతాదుల గొప్పచూడక కృష్ణనామం
గురుతుగా శూద్రాన్నమునె తాగోరె నీనామం శ్రీకృష్ణనామం

16) సకల లోకములకును ప్రభువై సంచరించెడి కృష్ణనామం
ఒకమనుష్యుని రథము తోలగ నొప్పె నీనామం శ్రీకృష్ణనామం

17) ఉభయ సేనాకలి తమగు కదనోర్విలోపల కృష్ణనామం
శుభతరంబుగ బలికె గీతాసూక్తులీ నామం శ్రీకృష్ణనామం

18) అతుల చిత్ర విలాసలీలా వితతమైనది కృష్ణనామం
ప్రతిదినము పఠియించు వారికి భాగ్యమీనామం శ్రీకృష్ణనామం

19) పొలుపుగా నిల పూడివాడలో వెలసియున్నది కృష్ణనామం
నిలిచికొలిచెడి వారలకు రత్నాలనిధి ఈనామం శ్రీకృష్ణనామం

20) స్థిర గుణాంబులకెల్ల నాలయ సీమయైనది కృష్ణనామం
ధరణిలోపల విష్ణుదాసుని దైవ మీనామం శ్రీకృష్ణనామం